శ్రీరస్తు

శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రగ్రన్థమాలా

సప్తమానుబంధమ్

# శ్రీమద్ధన్వన్తరిప్రతిష్ఠాకల్పః

( మహామన్త్ర యన్త్రోద్ధార సహితః )

విద్వద్భిః పరిష్కృతః



ఆయంకిల శ్రీ మచ్చోళ నగరీ వాస్తవ్యానామ్, ఉభయవేదాన్త ప్రవర్తకానామ్,
శ్రీమతామ్ వేదాన్తం లక్ష్మణాచార్య వర్యాణామ్
ద్రవ్యసహాయేన ముద్రాపితో విజయతేతరామ్

గ్రన్థమాలా సమ్పాదకః

ఉ. వే. ప్ర. శ్రీమాన్ భిషగ్రాజ

## దీవి వేఙ్కట నృసింహాచార్యః

## నల్లూరు

రిజిష్టర్డు కాపీరైటు ] 1949 [ఏతన్మూల్యమ్ రు. 2-0-0

## భగవాన్ శ్రీ ధన్వన్తరిః



కార్తికే కృష్ణపక్షేచ త్రయోదశ్యాంగురోర్దినే
నక్షత్రే వాయ దైవత్యే ధనుర్లగ్నే విశేషతః ।
భక్తానాం రక్షణార్థాయ ధన్వంతర్యాఖ్యయా హరిః
క్షీరోదధౌ సముద్భూత శ్రీసాక్షాత్సనాతనః ॥



శ్రీమదిత్యాది శ్రీమాన్

శ్రీ వై॥ భ॥ గ్రంథమాలా సంపాదకులు

దీవి వేఙ్కట నృసింహాచార్యులు గారు

నెల్లూరు



అపరధన్వన్తరి

కీ॥ శే॥ ఆయుర్వేద మార్తాణ్డ భిషఙ్మణి, వైద్యరత్న

పణ్డిత డి. గోపాలాచార్యులుగారు

శ్రీయైనమః

శ్రీ ధన్వన్తరయే నమః

# గ్రంథ ముద్రాపక ప్రశంసా

శ్లో॥ కృష్ణాతీరే కనకగిరిజాఽఽవాస రమ్యేన్ద్రకీలా
నానాదేశాగత జనగణై ర్మణ్డితాఽఽగారమాలా
ధూమోద్గారై శ్శకటనిచయై ర్యన్త్రికాభి ర్విశాలా
ఆస్తే చాంధ్ర్యాం భువి విజయవాడాభిధా రాజధానీ॥

శ్లో॥ తస్యా స్సకాశే పురమస్తి చోడవరాభిధం కేశవదేవ పాలితం
చకార తస్మిన్ వసతిం భృగూద్భవో లక్ష్మీనృసింహో హృత
వైరిరంహాః ॥

శ్లో॥ ఆగస్త్యాచ్ఛ్రీశపాదాఽర్చనరతకులజం శ్రీనృసింహార్యసూరిం
ఆర్తా స్త్రాతుం త్వరాణాం భిషగితి విబుధా మేనిరే గీష్పతిం తమ్
ఛాత్రా శ్రీసూత్రకార న్త్వతిథిగణ మహో చింతితార్థప్రదం శ్రీ
లోకంమారంసుత న్త్రిశ్వాణన గణమముం తుంబురం నారదం వా॥

శ్లో॥ స వేఙ్కటాభిధాం లక్ష్మీముపయేమే బుధోత్తమః
సుశీలాం పతిశుశ్రూషారతాం సీతామివాపరామ్॥

శ్లో॥ తయోరభూతాం తనయౌ రమ్యౌ లక్ష్మణవేంకటౌ
జ్యేష్ఠ శ్శ్రేష్ఠ గుణైర్యుక్తో వేదాఽఽయుర్వేద పారగః

శ్లో॥ గౌతమాన్వయ సంజాతాం మంగమాంబాం క్షమోపమాం
లక్ష్మణ శ్చోపయేమే తా మలిమేలు పదోపధామ్॥

శ్లో॥ విఖనసపదసేవా జీవనో సత్స్వభావో
విమతజన విహీనో శ్రీశ సేవారత స్సః
అనుదినమపి వైద్యాఽఽచార్య సేవాత్తచిత్తో
మధురవచనజాలా బద్ధ మన్దస్మితాస్యః॥

శ్లో॥ గరుడ పవనజాఽహీంద్ర ప్రతిష్ఠాప్రసిద్ధో
దశరథసుత కీశాధీశమన్త్ర ప్రసిద్ధః
శ్రితజనగణబాధా వారణే చానిరుద్ధో
గురుపదరత చిత్తో లక్ష్మణోఽభూత్ప్రబుద్ధః॥

శ్లో॥ లతాప్రతానోద్గమ గుచ్ఛసున్దరం
ప్రసూనజాలోద్భవ గన్ధబన్ధురం
నిపీతపుష్పాసవ మత్తబంభరం
విరాజతే లక్ష్మణసూరి మన్దిరమ్॥

శ్లో॥ అభ్యన్తరాస్తీర్ణ సురత్నకమ్బలం
దిగన్త రాయాత నతార్త మణ్డలం
ఖల్వాన్తరాఽపూరిత సద్రసాయనం
విరాజతే వైద్యమణే ర్నికేతనమ్॥

శ్లో॥ ధన్వన్తరి పదోపేతం రామశేషాఖ్య మాత్మజం
లేభే శ్రీ లక్ష్మణాచార్య స్త్వాంగ్లవిద్యా విశారదమ్॥

శ్లో॥ సూనునా రామ శేషేణ పత్న్యా మంగాంబయా యుతం
పాత్విమం లక్ష్మణాచార్యం సదా ధన్వన్తరి ర్హరిః॥

శ్లో॥ సోఽభూ ల్లక్ష్మణపణ్డితస్య భగినీసూను ర్నృసింహాత్మజో
భారద్వాజ కులోద్భవ స్త్రిమునగ ర్వ్యాఖ్యాన్వయే సంభవః
సీతారామ భిషగ్వర స్సురభిష క్తుల్య శ్చికిత్సావిధౌ
నమ్రో మాతులమాతులీ ముఖజనే శ్రీరాజ్యలక్ష్మీసుతః॥

శ్లో॥ పరిణయే సమవాప స భార్గవీం కమలకోమల మన్దహాసన్ముఖీం
వినుత తాయమనామ విభూషితాం స్మరవధూరివ సుందరసుందరీమ్॥

శ్లో॥ అమ్భోధిశ్శశినం రమామనసిజం రామందశస్యన్దనో
వైదేహీ సుషువేలవం శరభవం శంభు ర్యథా జాహ్నవీ
భీష్మం చానకదున్దుభిర్మురరిపుం భూ ర్భారతీ జహ్వారుం
తౌ శ్రీ రాఘవకృష్ణనామకసుతం వీరోపధాహ్వాం కృతిమ్॥

శ్లో॥ ఏతన్ముద్రాపణే మూల్య దాయినో రనయో ర్భృశం
శుభం దదాతు సర్వత్ర సుధాపాణి ర్భిషజ్మణిః॥

ముత్తేవి అనన్త పద్మనాభాచార్యులు
దేవరపల్లి (కృష్ణాజిల్లా)

శ్రీధన్వన్తరయే నమః

# కృతజ్ఞత

శ్లో॥ అమృతకలశహస్తం కాన్తిసంపూర్ణదేహం।
సకలవిబుధవన్ద్యం వేదశాస్త్రైర్విచిన్త్యమ్।
రుచిరవిమలపార్శ్వం శంఖచక్రాయుధాఢ్యమ్।
సకలగదవినాశం చింతయేద్వైద్యదేవమ్॥

మహాశయా!

ఈ గ్రంథమును గూర్చి కొలది విషయములం జెప్పవలసియున్నది. పూర్వకాలమునందు శ్రీ మన్నారాయణుని అంశముతో సర్వప్రజల యొక్క ఆయురారోగ్యములను కాపాడుటకు శంఖచక్ర ఓషధీయమృత కుంభముల తన దివ్యహస్తములం ధరియించి పద్మాసనాసీనుండై క్షీరాబ్ధినుండి శ్రీ ధన్వంతరి భగవానుడవతరించె. ఈ యవతారము ఏకవింశత్యవతారములలో నొకటై విరాజిల్లుచుండు. శ్రీధన్వంతరిరూపియగు పుండరీకాక్షుడు తొలుత నాయుర్వేదమును సంక్షేపముగ చతుర్ముఖున కుపదేశించె, నాయనవలన ఇన్ద్రాది దేవతలు, భృగ్వాదిమహర్షులు పరంపరగా నుపదేశము బొందుచు గ్రహించి లోకానుగ్రహకాములై యావిద్యను శాఖోపశాఖలుగ విభజించి నన్నిగణముల వారికి సులభసూక్ష్మముగ నుండులాగున నేర్పఱచి ప్రజాభివృద్ధి గాంచునటుల సనుగ్రహముతో ప్రబలప్రచారమునకుం దెచ్చియుండిరి, ఆ ధన్వంతర్యవతారము శ్రీమహావిష్ణువుయొక్క ప్రాదుర్భావావతారమై యున్నయది. ఇట్టి ధన్వంతరి భగవానుని విగ్రహరూపమున ప్రతిష్ఠించి నిత్యముపూజించుట భారతావనియం దెచ్చట నోనుండియు భక్తకోటికి నందుబాటులో లేకుండుట జూడ కడు విచారకరము. మృత్యునాశంకరుడగు నా ధన్వంతరిమూర్తిని మానసోల్లాసముగా నర్చించుటకు నివాసయోగ్యమనందగు ఆలయ గోపుర మంటపధ్వజపతాకప్రాకారనిలయ నిర్మాణములును యావద్భారతభూమియం దచ్చటచ్చటనిర్మించి యందులో హద్దారు శిలాదు

లచే ధృవకౌతుక ఉత్సవ స్నపన బలిబేర అను పంచబేరాత్మకముగ శిల్పకళానైపుణ్యముతో చిత్రవిచిత్రములుగా శాస్త్రోక్తవిధముగా సిద్ధపరచి, శ్రీ భగవదాగమశాస్త్ర విధివిధానములచే నాలయ బింబాదులు ప్రతిష్ఠింపించి పూజించుచు శ్రీ వారి పరిపూర్ణకటాక్షమునకు పాత్రులై లోకకల్యాణము చేకూర్చుటకు నెన్నియో సులభసూక్ష్మ మార్గముల నిందు సమకూర్చబడినవి. వీనిని నియమనిష్ఠాగరిష్ఠులై యాచరించి, జ్ఞాన తేజము ప్రకాసింప భజియించుచు భక్తాగ్రేసరులై నిత్యానంద తృప్తులగుదురుగాత యని సర్వదా ప్రార్థించుచున్నాడను.

శ్రీ ధన్వంతరి ప్రతిష్ఠా కల్ప గ్రంథ సంపాదన పరిశ్రమయందు సర్వవిధముల తోడ్పడిన మహాశయులకు కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుట నా విధియై యున్నది. బహుకాలము క్రిందట మద్గురు వర్యులగు శ్రీమాన్ రాజవైద్య పండిత దీవి వేంకటాచార్యులుగారు (పణుకూరు) కడుపుత్రవాత్సల్యముతో నన్ను శ్రీధన్వంతరిభగవానుని కృపకు పాత్రునిగా జేసిరి. సతతపరిణామియగు దేవభిషగ్మణి బ్రహ్మ రుద్రేంద్రాది నారదతపోమహిమాన్విత యక్షరహోగణములనుండి చరకఋష్యాది మానవులవరకు సుకృత మహాధన్వంతరి యనపాంచ భౌతిక దేహధారియై వ్యాప్తిజెందుచు యీ కలికాలమున కుపక రించుచుం గ్రమాగతముగ పుణ్యభారతమునందు దశదిశలు వెలుగొంద పరమపురుషుడై అపరధన్వంతరియోయన యశఃకాంతులు చెలరేగ ఆయుర్వేదమార్తాండ భిషజ్మణి వైద్యరత్న పండిత దీవి గోపాలాచార్య స్వరూపియై ఉద్భవించి ఆయుర్వేదమును పునరుద్ధరించెను. వీరి కాలమునందు శ్రీ ధన్వంతరి భగవానుని పూజాకల్పము నొకదానిని సంపాదించి సంస్కరించి ముద్రించి మనలోకమున కనుగ్రహించిరి. వారి యశోదీపికలను నిచట స్థిరస్థాయిగనుంచి మానవ పాంచభౌతిక దేహమును వదలి దివ్యదేహధారియై స్వర్గము నలంకరించిన శ్రీ ఆచార్య పాదారవిందములకు ప్రణవకుసుమము లర్పించుట మనవిధియై యున్నది ॥

ఇంతట శ్రీ వారనుగ్రహించిన పూజావ్రత కల్పమునందలి విష యముల నాచరించుచు నింకవైదుక వివిధాగమ భగవచ్ఛాస్త్ర ములయందును శ్రీ ధన్వంతరి భగవానుని యంత్ర మంత్ర తంత్ర ఆలయ విగ్రహప్రతిష్ఠార్చనాది విశేషములందెలిపెడి సద్గ్రంథము లెచట లభించునా యని ధ్యానించుచుండ కొలదికాలమునకు నూజవీడు సంస్థాన పండిత వంశజులు బ్రహ్మశ్రీ వైద్యవిద్వాన్ గంటేల వేంకట ప్పయశాస్త్రులవారు నాయెడ ఉదారమనస్కులై శ్రీధన్వంతరి యంత్రము నొసంగిరి. వారికిని యీ యంత్రమునకు ఉద్ధారమును శ్రద్ధతో సంపా దించి, మంత్రసిద్ధులు బ్రహ్మశ్రీ చెరుకుపల్లి నరసింహశాస్త్రులవారిచే సంస్కరింపజేసి, అందించిన బ్రహ్మశ్రీ పండితశిరోమణి చివుకుల సత్యనారా యణవారికిని, ధన్వంతరి మహావిద్యా పూర్వ ఉత్తరామ్నాయ ఖండ మహామంత్రముల నిచ్చిన (బె॥ తా॥) ఆకెళ్ళవారి గొడవర్రు నివాసులు మంత్రనిష్ఠులు బ్రహ్మశ్రీ నిమ్మగడ్డ లక్ష్మీనరసింహ ఘనాపాఠిగారి కిని, గుడివాడ తాలూకా కురుమద్దాలి గ్రామవాసులు, మంత్రవిద్యా గురువులు శ్రీమాన్ ముత్తేవి చలమాచార్యస్వామిచే సముపార్జిత తాళపత్ర గ్రంథములనుండి శ్రీధన్వంతరి స్థాపన పూజా ధారణ యంత్రోద్ధారములును, షడక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి, ద్వావింశాక్షర, గాయత్రీ మంత్రోద్ధారములను ఆదరాభిమానులై అనుగ్రహించిన గురుపుత్రులకును యీమంత్ర యంత్రోద్ధారముల నెప్పటికప్పుడు శ్రమయనక, శిష్యవాత్సల్యముతో సవరణసంస్కార ములు గావించి, పూజోపాసకుల కనుగ్రహించిన తెనాలిపట్టణవాస్తు లును, మంత్రనిష్ఠాగరిష్ఠులును వేదమూర్తులును అయిన బ్రహ్మశ్రీ భాగవతుల దక్షిణామూర్తి శాస్త్రులవారి ప్రియపుత్రరత్నమును శ్రీరామ పంచముఖ ఆంజనేయోపాసక నిరతులు, శ్రీవారి పదసరోజ సేవాతత్పరులకును అనంతప్రణామము లర్పించుచుంటిని. శ్రీభగవ చ్ఛాస్త్రగ్రంథములలో ప్రసిద్ధిగాంచిన భృగుసంహిత అర్చనాధికార మునంగల శ్రీధన్వంతరి ప్రతిష్ఠాకల్పాధ్యాయమును అనుగ్రహించిన తిరుపతిక్షేత్ర శ్రీవేంకటేశ్వర సంస్కృత కళాశాలోపాధ్యాయులును

ఆగమశాస్త్రపండితులును, అయినశ్రీమాన్ వైయాకరణపంచానన రొంపి
చర్ల భట్టర్ పార్థసారథి కృష్ణమాచార్యులు గారికిని ఈకల్పానుగుణముగా
అర్ష సంహితలు కల్పములను సమ్మేళన మొనరించి ప్రతిష్ఠా ప్రయోగా
ర్చనావిధులను సుబోధకముగ శ్రమయనకవ్రాసి, ప్రసాదించిన
యీపూరుగ్రామవాసులును, బహుశాస్త్రామ్నాయ పండితవరేణ్యు
లగు శ్రీమాన్ దేవయజనం వేంకటరామాచార్య సుధీమణులకును శ్రీ
ధన్వంతర్యష్టోత్తర శతనామస్తోత్రాది మంగళాచరణశ్లోకముల రచి
యించిన (బె॥ తా॥) దేవరపల్లి నివాసులు శ్రీమాన్ కవితాతిలక,
ముత్తేవి అనంతపద్మనాభాచార్యులవారికిని శ్రీ ధన్వంతరి సహస్రనామ
స్తోత్ర కరావలంబ సుప్రభాత మంగళాచరణ ప్రాతస్మరణ శ్లోకము
లను శ్రీ ధన్వంతరిమూర్తికి ప్రీతిగా రచనచేసి సంస్కరించి నాయెడ
వాత్సల్యాభిమానులై పంపిన (రే॥ తా॥) ఉల్లిపాలెం నివాసులును
శ్రీ భగవచ్ఛాస్త్ర విద్వాంసులును పండితాతిలకులునగు శ్రీమాన్
నాగామణం రామానుజాచార్యవరేణ్యులవారికిని శ్రీ ధన్వంతరి చరణ
పంచక శ్లోకములను భక్తిపురస్సరముగ సమకూర్చి యందించిన
(కృ॥ జి॥) బల్లిపఱ్ఱుపుర వాసులును శ్రీ లక్ష్మీహయగ్రీవ పాదసేవా
నిరతులయిన పండిత వేదాంతం అనంతపద్మనాభాచార్యుల వారి
కిని, శ్రీ ధన్వంతరి సహస్రనామముల పూర్వప్రతిని దయతో
పంపిన (తె॥ తా॥) అంగలకుదురు పురవాసులు రాజవైద్య శ్రీయుత
బలభద్రపాత్రుని భుజంగరావుగారికిని, అశేష కల్పగాథ లుపదేశించిన
శ్రీమాన్ డాక్టరు భిషగ్వర గండికోట శ్రీనివాస రావుగారికిని, శ్రీధన్వం
తరి మహామంత్రములు ప్రకారాంతరములుగానున్న ప్రతుల నను
గ్రహించిన యోగసిద్ధపండితులు బ్రహ్మశ్రీ దంటు పార్థసారథిశర్మ
గారికిని, ఈ గ్రంథమునకు అత్యంత ఉదారమనస్కులై పీఠికను వ్రాసి
యిచ్చిన శ్రీమాన్ కవిరాజ ప్రతివాది భయంకరం కృష్ణమాచార్యా
పర సుశ్రుతమూర్తి వారికిని, నాకింకననేకవిషయములయందు, సత్సలహా
లొసంగిన విజయవాడ త్రిలింగ విద్యాపీఠ పండితోపాధ్యాయ వర్యుల
వారికిని, బహుపండిత ప్రకాండులగు మహనీయులకును యీ గ్రంథ

సంస్కరణమునకు శిష్యవాత్సల్యతతో శ్రమజెంది సవరణగావించి ఆశీస్సులతో నొసంగిన శ్రీ భగవచ్ఛాస్త్రపండిత వరేణ్యులగు శ్రీమాన్ ఉత్తర తాళపాక చక్రవర్తుల శ్రీనివాసభట్టాచార్యుల వారికిని నిరతిశయ ప్రోత్సాహముల నుపదేశించు ప్రసిద్ధపండితులును గురువరేణ్యులు నగు (బె॥ తా॥) పోరంకి పురవాసులు శ్రీమాన్ పండిత వేదాంతం రాజగోపాలాచార్యులువారు, శ్రీమాన్ పండిత వేదాంతం శ్రీనివాసాచార్య ఘనపాఠివార్లకును ఈ గ్రంథమును తమ శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రి గ్రంథమాలయందు సప్తమానుబంధముగా ప్రకటన మొనర్చుటకు శ్రద్ధంబూని కార్యసానుకూల మొనరించిన రే॥ తా॥ నల్లూరుపురవాసులును విద్యానైపుణ్య సంపన్న యశస్కులగు శ్రీమాన్ భిషగ్రాజ దీవి వేంకటనరసింహాచార్యుల వారికిని ముద్రణ కార్యములలో సాయమొనర్చిన పరమమిత్రులు పెదరావూరుగ్రామవాసులు శ్రీమాన్ తమిరిశ శ్రీనివాసాచార్యులు వారికిని, నాబంధుసుహృన్మిత్రులకును యీ గ్రంథమునకు తమ తమ పండితాభిప్రాయముల కృపచేసిన మహాపండిత పామరశ్రేష్ఠులగు వారలకును నిరంతర కృతజ్ఞతా నమోవాకములర్పించుచున్నాను.

నింక తెనాలి ఓరియన్‌టల్ పవర్ ప్రెస్ యజమానులకును పండిత వర్యులకును, కార్యనిర్వాహకులకును ఏతన్ముద్రణా సందర్భమున సౌకర్యముకల్పించి శీఘ్రముగా నందించినందున కృతజ్ఞతలం దెల్పుకొనుచున్నాడ.

ఇందు సమకూర్చిన విషయములయందు ప్రవేశ ప్రచారములేని క్రొత్తవాడనగుటయు, ఇదియే తొలిప్రవేశమగుటచేత గ్రంథమునందు లోపములెన్నెన్నో ఉండినవనియే తలచెదను. అట్టిలోపములను మహనీయులగువారు శ్రద్ధాదరములతో పరిశీలించి నాకందచేసినవానిని శిరసావహించి పునర్ముద్రణమున సవరించుకొందునని వేవేల ప్రార్థించుచుంటిని,

శ్రీధన్వంతరి భగవానుని అమోఘకటాక్షవీక్షణ భాగ్యము చేనింత శీఘ్రకాలములో యీగ్రంథమును ప్రజా హస్తరాజములయందు విరాజిల్ల చేయంగలిగినందులకు ఆ తేజోమూర్తిని ప్రార్థిస్తున్నాడను,

'లోకాస్సమస్తా స్సుఖినోభవంతు'

మంగళం సాగరోద్ధారాయ పీయూషకలశాయచ
ఆయుర్వేద స్వరూపాయ మంగళం శుభహేతవే॥

సర్వధారి సం॥
మాఘ బ ౧౧
బుధవారం
ది 23—2—49.

ఇట్లు
భవత్పాదరేణువు
వేదాన్తం లక్ష్మణాచార్యులు,
చోడవరం (కృష్ణాజిల్లా)

శ్రీ ధన్వన్తరయే నమః

## పీ ఠి క

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, నిరవధిక కరుణా పరిపూర్ణ హృదయుండును, సకలచరాచర లోకావన దీక్షాపరతుండును, అపరిమిత కల్యాణ గుణాకరుండును, పరాత్పరుండును నగు శ్రీమన్నా రాయణుండు నానారీతుల బాధల ననుభవించుచు దుఃఖాంబుధిని మునిగి తేలుచుండు దేవ మానవ తిర్యక్స్థావరాది సకలజీవుల కష్టంబుల నాలోకించి కరుణాతిరేకంబున నోర్వంజాలక పరవ్యూహ విభవాంతర్యా మ్యర్చారూపంబుల నానారీతులగు నాకృతులనంది తత్తదుచిత కృత్యం బుల నిర్వర్తించుచు జీవకోటుల గాపాడుచుండును.

అందు పరాత్పరుండై పరాకృతినందియుండు శ్రీమన్నారాయ ణుండు ప్రకృత్యతీతంబును దివ్యంబునునగు త్రిపాద్విభూతియందుండి అచ్చటి నిత్యముక్తాదుల గాపాడుచుండును. త్రిపాద్విభూతికి భిన్నంబగు నేకపాద్విభూతియందలి దేవ దానవ యక్ష రక్షో గంధర్వాదులగు దేవ యోనుల కా త్రిపాద్విభూతి అగమ్యంబై యుండుటచే నాయాది దేవుండు వారియందలి కరుణాతిరేకంబున వ్యూహాకారంబున పాల కడలికరుదెంచి శేషశయ్యంబరుండి నారి కష్టసుఖంబుల నాలకించుచు వారికి అండయై యుండుచుండును.

పరవ్యూహంబులు రెండును మానవాళికి అలభ్యంబులై యుండుట నెఱింగి యా దేవదేవుండు రామకృష్ణాద్యవతారంబుల ధరించి మానవు లకు సరిసమానంబుగ వారితో కలిసిమెలసి తిరుగాడుచు వారితోపాటు కష్టసుఖంబులబొందుచు తనదయాతిరేకంబున వారిం గాపాడుచుండును. ఈయాకృతిని విభవాకృతియందురు. విభవావతారంబులును ఆ కాలము వారికితప్ప తక్కినవారికి అలభ్యంబైయుండుటచే నాపరాత్పరుండు ప్రతిజీవియందును అంతర్వ్యాప్తికలిగి చేరియుండి ఆజీవి సరియగు మార్గంబున నడచి బాగుపడు ప్రయత్నముల నాచరించుచు కాపాడు చుండును. దీనిని అంతర్యామి స్వరూపమని యందురు.

పైచెప్పబడిన మొదటి మూడురీతులగు భగవదాకృతులును ఆయా ప్రదేశములవారికిని కాలములవారికినితప్ప తదన్యుల కలభ్యంబులై యుండుటచేతను అంతర్యామిరూపంబును అవ్యక్తంబై అజ్ఞుల కగోచరంబై యుండుటచే సర్వసులభమై యుండకుండుటచేతను సర్వకాలములయందును, సర్వదేశములయందును సర్వసులభంబై యుండురీతిని నా భగవానుడు అర్చారూపంబున నేర్పడియుండి అందరిచేతను పూజల నందుచు అందరిని కాపాడుచు మానవులు కోరినచోటుల నంతటను నధిష్ఠానంబు నంది యుండును.

ఆ భక్తాధీనుడగు దేవుండు చెట్టునందో పుట్టయందో ప్రమానునందో జాతియందో లోహంబుననో యంత్రంబుననో వారివారికి ఇష్టము కలిగిన రూపంబులతో " మంత్రాధీనంతు దైవతమ్ " అనునట్లు మంత్రబద్ధుండై యధిష్ఠించియుండి వారేర్పరచిన యావాసంబును తమ కావాసంబుగా గ్రహించి వారి వారి శక్త్యనుగనో ప్రియముగనో దోచిన యాహారంబుల స్వీకరించుచు పూజోపచారముల నందుకొనును. సంతుష్టుండై యుండి వారి వారి కష్టసుఖంబులకు తోడు నీడయై యుండును.

ఇట్టి యీ రూపంబును అర్చారూపంబందురు. యీ అర్చారూపము సర్వసులభమై సర్వప్రాప్యమై సర్వగమ్యమై యుండుటచే మన దేశంబున నన్నిచోటులను వెలసియున్నది.

మున్ను కృతయుగంబున దేవకార్యమును సాధింప పాలకడలి ద్రచ్చునెడల నందుండి యమృతకుండికనందుకొని శ్రీధన్వన్తరి రూపంబున నాయాదిదేవుండవతరించి యుండుట నిగమాగమేతిహాస పురాణ ప్రసిద్ధమగు విషయమై యున్నది. ఈ యవతారము విభవావతారము ఆవిభవ ధన్వంతరిమూర్తి అమృతకార్యమును నిర్వర్తించిన పిమ్మట 'దేవభిషక్కు' గ నేర్పడి యుండినట్లు కన్పట్టు చుండినది. ఈ యవతారమునకు వేదములయందు " దేవానాంభిషక్ ప్రథమో దైవ్యోభిషక్; భిషగ్రక్షోహామీవద త్తద్భేషజం ఆవాతవాహి భేషజమ్" అని నిగమాగము బహు ప్రమాణములచే దేవభిషజ్ఞామము ప్రసిద్ధి

నంది యుండునట్లు కానవచ్చెడిని. సుప్రసిద్ధ పురాణముల యందీ యవతారమునకు "ధన్వంతరి" యను నామము కలిగినట్లు కానవచ్చెడిని.

శ్రీరామకృష్ణాద్యవతారంబులకువలె నీ ధన్వంతర్యవతారమునకును ఆ యవతార కాలమునకును దేశమునకును భిన్నములగు దేశకాలముల యందుండు వారికి కూడా ప్రత్యేకారాధన సంభవమగుట కనుకూలముగ అర్చారూపమును, ప్రతిష్ఠయు, ఆలయమును, యంత్రములు, పూజలును, వ్రతాదులును ఏర్పడియున్నవి. వీని విధానము లన్నియు వేదముల యందును, ముఖ్యముగ ఆగమగ్రంథముల యందును, మంత్రశాస్త్రములయందును కనపడుచున్నవి, ఈవిధి విధానము లన్నియు సంపాదించువారు లేనందున అవి ఇంతవరకును అలభ్యములై కానరాకుండినవి. ఆయాలయ మంత్రతంత్రములు లేవని భ్రమచెందు స్థితి కలిగియుండి యున్నది.

ఇట్టి స్థితియందు కృష్ణాజిల్లా చోడవరంగ్రామ నివాసులు శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులవారు బహుశ్రమలకు లోనై వేదముల నుండియు, ఆగమములనుండియు, మంత్రశాస్త్రముల నుండియు సంపాదించి శ్రీ ధన్వంతరి భగవానుని ఆలయాది అర్చా విగ్రహ ప్రతిష్ఠలు, యంత్రమంత్రోద్ధారములు, అర్చన పూజాపురస్కార జపహోమ తర్పణధ్యానాది విధానములు, శతసహస్రనామ స్తోత్రాదికములు మొదలగు సర్వాంగములను సమకూర్చి ఆయాపండితవర్యులచే సంస్కరింపజేసి లోకోపకారము కొరకు ఈ గ్రంథరూపమున ప్రకటించి యున్నారు.

ఆ శ్రీధన్వంతరి భగవానునియందు శ్రీమాన్ ఆచార్యులవారికి కలిగియుండు అనతిశయ భక్తియొక్క ప్రభావమువలననో, శ్రీధన్వంతరి వారికి ఆచార్యులగారియం దేర్పడియుండునట్టి అపార కరుణా మహిమ వలననో వారికీ యతిరహస్యవిషయ సముదాయము లన్నియు నతిశీఘ్ర కాలములో లభ్యములైనవని నేను పూర్తిగ తలంచుచున్నాను.

శ్రీ ఆచార్యులవారిదివరకు శ్రీ ధన్వంతరిపూజా వ్రతకల్పమను గ్రంథము నొకదానిని ప్రచురించి ధన్వంతరి భక్తబృందమున కుపకృతి యొనరించి యున్నారు. ఇప్పుడీ గ్రంథమువలన అశేషజనమునకును ఆయురారోగ్య భాగ్యములు కలిగి మహోపకార మేర్పడగలదని గట్టిగఁ జెప్పుచున్నాను.

ఈ గ్రంథప్రచురణమువలన శ్రీ ధన్వంతరి దేవాలయములు సక్రమము గు పద్ధతిని ప్రతిష్ఠింపబడి వానియందలి విగ్రహములు యంత్ర మన్త్ర జప ధ్యాన ప్రభావములవలన భక్తబృందము యొక్క ఆయురారోగ్యములు సంరక్షింపఁబడి దేశసౌభాగ్యము పెంపొందుగాకయని యాశాసించుచున్నవాడను.

విజయవాడ }

ఇట్లు
కవిరాజ ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులు

శ్రీ

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్లో॥ ధన్వన్తరి ర్నిఖిలనిర్జర మౌళిరాజ
న్మాణిక్య రఞ్జితపదామ్బుజయుగ్మ రుక్మః।
దత్వాముదా సకల భాగ్యనిధాన భూత
మారోగ్య భాగ్యమవతాద్దయయా సదా నః॥

అయిభోః ఆస్తికాస్సర్వే శ్రేయోభిలాషిణస్సుధియః సువిదితమే వైతత్తత్ర
భవతాం ప్రమాణభూతార్థేష్వేషు శ్రుతి స్మృతి పురాణాదిషు భగవాన్ సర్వేశ్వర
శ్శ్రీమన్నారాయణ స్సత్యసఙ్కల్పోఽనారోగ్యాది దుఃఖసముద్రమగ్న సకల చేత
నోద్దిధీర్షయావిగృహీత ధన్వన్తరి రూపస్సకల సురాసుర మథ్యమాన సుధామ్బురా
శేరవతతార తత్వాఖ్యానం ప్రసిద్ధమాస్త ఇతి (యథా) అథర్వవేదే తృతీయ కాణ్డే
యజుర్వేదామ్నాయ మన్త్రబ్రాహ్మణే తృతీయాష్టకే సప్తమప్రపాఠకే చతుర్థాను
వాకేచ, వర్తమాన శ్రీధన్వన్తరి షడక్షరాష్టాక్షర ద్వాదశాక్షర ద్వాత్రింశాక్షర
గాయత్రీ; మృతసఞ్జీవనీ మహామన్త్ర జాతం సర్వం, గ్రన్థేఽస్మిన్ దరీదృశ్యతఏవ,
"విఖనామునినా" మితిశ్రుతి ప్రసిద్ధమహిమ్నా భగవతా విఖనోమహామునినా
ప్రణీతే శ్రీవైఖానస గృహ్యసూత్రే "యద్వ్యేక్ఞ్చ మనురవదత్తద్భేషజ"
మితివేద ప్రతిపాదిత మహాప్రభావే విరచితే, మానవేధర్మ శాస్త్రేచ, వైశ్వదేవ
ప్రకరణే "ధన్వన్తరయేస్వా"హేతి ధన్వన్తరేః ప్రాధాన్యం ప్రత్యపాది. అపిచ,
శ్రీమద్భాగవతే మహాపురాణే ద్వితీయస్కన్ధే సప్తమాధ్యాయే భగవత ఏకవింశత్యవ
తారవర్ణనే:

శ్లో॥ ధన్వన్తరిశ్చ భగవాన్ స్వయమేవకీర్తిర్నామ్నానృణాం।
పురురుజాం రుజ ఆశుహన్తి। యజ్ఞేచభాగమమృతాయురవా వరున్ధ॥
ఆయుష్యవేదమను శాస్త్యవతీర్యలోకే ఇతి

ఏతదర్థవివరణం వ్యాఖ్యానేషుద్రష్టవ్యం దిదృక్షుభిరితి విస్తరభియా న
లిఖ్యతేఽత్ర. శ్రీత్రివష్ఠస్కన్ధేఽష్టమాధ్యాయే నారాయణ వర్మోపదేశే "ధన్వ
న్తరి ర్భగవాన్ పాత్వపథ్యా" దితిచ

అన్యచ్చ,ధన్వన్తర్య వతారతిథివారనక్షత్రాదికం తజ్జయన్తీ పూజామన్త్రకల్పా
దికంతత్కథాప్రస్తావాదికంచ శ్రీమద్బ్రహ్మాణ్డ పురాణాన్తర్గతం సర్వం తత్ప్ర
కాశ్యతే.

అథచ ధర్మార్థకామమోక్షాణాంచతుర్ణామపి పురుషార్థానామాదిమసాధనత్వే
వనిర్ణీతమిదమ్మానవశరీరమనామయే నాను వర్తమానమేవహి పూర్వోక్త పురుషా
ర్థోపకరణంభవిష్యతీతి ప్రత్యక్షాదేవగమ్యతే తతస్తావదారోగ్యస్యసకల శరీరి
సమఖిలష్టకాణ సాఙ్గవశ్య సాధనభూతత్వే షట్క ప్రతిపాదక మాయుర్వేదమితి,

తదుపదేశకశ్చ నిరవధిక కృపాసిన్ధు ర్భగవాన్ సకల జగదుద్దిధీషు శ్రీమద్ధన్వన్తరి రితి విజానతాం సర్వేషామస్మాకం స ఏవసమారాధ్య ఇతినిశ్చీయతే. అతస్తత్ప్రసన్నతా సంపాదనాయ తత్సమారాధనమే వానవరతం శ్రద్ధాభక్తిపురస్సరం యథోక్త మార్గేణ కర్తవ్యమితి, మహర్షయః ప్రతిపాదయన్తి. కుర్వన్తిచైవమేవ మహాన్త స్సర్వదేశేషు పారమ్పర్యేణ విద్వదగ్రేసరాః॥

తత్సమారాధనంచ తత్ప్రతిమార్చనధ్యాన జప తర్పణ హోమ విప్రభోజన జయన్త్యుత్సవాదికమేవభవతి. తత్ర ప్రతిమార్చనం తు యథోక్తక్రమేణ శిలాసఙ్గ్రహణ విగ్రహనిర్మాణ భూపరీక్షాలయనిర్మాణ పూర్వక మహాప్రతిష్ఠా పూర్వకమేవ సమాచరణీయమితి విదాంకుర్వన్తు విద్వాంసః॥

తత్ప్రతిష్ఠార్చన మహోత్సవ స్నపనవిశేష పూజావిధానస్తు క్రమ "భృగుర్మే హృదయమస్తు. సర్వే అన్యే మునయోఽఙ్గభూతాః" "భృగుః కవీనాం" "మహర్షీణాం భృగురహం" మిత్యాదివచన జాతసువిదిత ప్రభావేన శ్రీమతాభగవతా భృగుణాఽను గృహీతే భగవచ్ఛాస్త్రేఽర్చనాధికారే సమ్యక్ప్రతి పాదితమ్. తత్త్వేతద్గ్రన్థమధ్యే సంయోజితం పశ్యన్తు పణ్డితవరేణ్యాః॥

భగవతి ధన్వన్తరేణ భక్తిమద్భిః కైశ్చి దాస్తికశిరోమణిభిర్మహతా ఉత్సాహేనముద్రాపితోఽయంగ్రంథ ఇతి నితరాం మోదావహోఽసౌ విషయః. అపితు యత్ర క్వాప్యస్మద్దేశే యథావిధి శ్రీధన్వన్తరేరాలయ నిర్మాణ ప్రతిష్ఠామహోత్సవాదికం విధాయ సోత్సాహం కృతకృత్యాస్సన్తో భగవతో ధన్వన్తరేః కృపాయాః పాత్రతా ముపగచ్ఛేమసర్వేవయమ్. ఏవంచేదే వముద్రితస్యాస్య గ్రన్థస్యచరితార్థతా స్యాదత ఏతదేవముఖ్య కర్తవ్యమితిచ ఆస్తికాగ్రేసరాన్ ముహుర్ముహుర్నివేదయామః॥

అథచ, అనేకభ్యః సకాశాత్తాంస్తాన్ విషయాన్ మహతా ప్రయాసేన సంపాద్య యథాశక్తి విద్వద్భిస్సంశోధయిత్వా స్వకీయేన ధనేన గ్రన్థమిదం సర్వజనోపకారకం ముద్రాపయిత్వా మహాశ్రమ మనుభోక్త్రే శ్రీమద్భృగుకులామ్బుధి రాకాసుధాకర (వేదాన్తం) శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రపారదృశ్వ సకలసద్గుణ మణిభూషిత శ్రీవేఙ్కటనృసింహాచార్య మనీషివరేణ్య సతీలలామభూత వేఙ్కమామ్బాగర్భశుక్తి ముక్తాఫలాయమానాయ శ్రద్ధాభక్తివినయాస్తిక్యాది సుగుణ విభూషితాయచిరంజీవినే లక్ష్మణదేశికసుధీవరాయ సహ కుటుమ్బాయ చిరాయురారోగ్యపుత్ర పౌత్ర ధనధాన్య విద్యావినయాది సర్వసంపదస్సమను గృహ్ణాతుకరుణాకరో భగవాన్ శ్రీధన్వన్తరిరితి నిత్యమాశాస్మహే॥

ఇత్థం భగవద్భాగవత చరణరేణుః

ప్రస్తుతమకాం: ఏలూరు

శ్రీ భగవచ్ఛాస్త్ర్యాది, పండిత

ఉత్తరతాళపాక చక్రవర్తుల శ్రీనివాసభట్టాచార్యః

దృష్టోమయాఽఽకలితశ్చ ధన్వన్తరి ప్రతిష్ఠాకల్పాఖ్యోఽయం నిబన్ధన గ్రంథః శ్రీమాన్ వేదాన్తం లక్ష్మణాచార్య సంపాదితః । దైవాసాగతే వైదికధర్మ ప్రచారే దురాచారదంతురేఽస్మిన్నపికలి కాల భాగేతృషార్తస్యేవ లోకస్యజలాశయ ఇవాఽయం సంతర్పకః। చికిత్సకానా మవశ్యసంభావ్యతయా శ్రీచరకాచార్య ప్రతి పాదితోఽపి దైవవ్యపాశ్రయః। తత్సంపాదనాయతదధి దైవతోపాసనా।తదధిగమాయ నిబన్ధన గ్రన్థశ్చావశ్యకః । తాదృశగ్రంథావసర కాలేఽస్మిన్నయ ముపస్థితః శాస్త్రపథికానాం నమేరురివ మధ్యేమార్గం। ఏతదాలంబనేనార్త చికిత్సకాస్సర్వేఽపి శ్రీధన్వన్తరికటాక్షోపలబ్ధ చికిత్సాసామర్థ్యాస్సంతో పురుషార్థవిఘ్న భూతరోగానీ తాన్నిర్ణుద్య సుఖమాపాదయంతు లోకస్యేత్యాశాస్మహే॥

ఇతి

బెజవాడ
రామనగరం
ది9-I-1949

వైద్యవల్లభ రాజ్ఞీ వెంకటాచలపతి ప్రసాద మహాగ్నిచిత్

విదితచరమేవ భవద్భిర్వైద్యమ్య సమానాధికరణం వచనం యన్మహావిష్ణురేవ లోకానుద్ధిధీర్షుః ధన్వన్తరి రూపేణఅవతతారేతి. తేనచ మహదుపకృత మాయుర్వేద విద్యాసమర్పణేనలోకస్యేతిచ, అతఃతద్విద్యోప జీవినాం అన్యేషాంచ తదుపాసనయా తదను గ్రహార్థినాం తదుపాసనా మార్గానవబోధేన నిర్విణ్ణానాం శ్రీమదాచార్య వర్యైః వేదాన్తం లక్ష్మణాచార్యైః శ్రీధన్వన్తరి కరుణాకటాక్షపాత్రైః ప్రఖ్యా పితమిదం గ్రంధరత్నం చింతామణిరాసీదిత్యత్రనకాపి విప్రతిపత్తిః. అత్రచ ప్రకటితం ప్రతిష్ఠా అర్చనా యన్త్రమన్త్రాదికం సుగమతయా ఉపాసకలోకస్య మహదుపకరిష్య తీతి స్థాలీపులాకన్యాయేన గ్రంథం పరిశీలయతామయా నిరటంకి గ్రంథసంపాదకాః శ్రీమదాచార్యపాదాః స్పృహణీయ చరితా ఇతి విజ్ఞాపయామి.

బుధవిధేయః

మకాం
విజయవాడ

న్యాయవేదాన్త పండిత, సాహిత్యశిరోమణి,మన్త్రార్ణవ,
చల్లా గోపాలకృష్ణశాస్త్రి,

శ్రీమద్ధన్వన్తరిప్రతిష్ఠాకల్పనామకమిదంపుస్తకం సాకల్యేనసావధానేనఅవలోకితంమయా అత్రతయావదావశ్యకం ప్రతిష్ఠావ్రతపూజోపయుక్తం విధానంతావత్సకలం సంయోజితం ఈదృశమిదంపుస్తకం శ్రీమద్ధన్వన్తరి ప్రబోధితైః ఏతత్సంపాదన బద్ధాదరైః శ్రీమద్వేదాన్త లక్ష్మణాచార్యైః ప్రసాధ్యప్రకాశితం। అతః నిగమాగమ ప్రసిద్ధమిదంపుస్తకం। శ్రీమద్ధన్వన్తరి ప్రసాదప్రేప్సుభిః సర్వైరాస్తికజనైః సాదరం పరిగ్రాహ్యం. ఆచరణీయంచ తదనుసారేణేతి నివేదయామి॥

త్రిలింగమహావిద్యాపీఠం
విజయవాడ
ది 20-12-48

ఏవంనివేదయితా,
తర్క-వేదాంతాచార్యః
మద్దులపల్లి మాణిక్యశాస్త్రీ.

శ్రీ ధన్వంతరి ప్రతిష్ఠాకల్పమను గ్రంథమును చూచి సంతసించితిని. ఈకల్పమును మధుకరన్యాయముచే సమకూర్చిన శ్రీలక్ష్మణాచార్యులు వారి అప్రతిమానశక్తి కడు శ్లాఘనీయము. ఈయది ధన్వంతరియందు వీరికిగల సహజభక్తి భావమును వెల్లడించుచున్నది. అంకురకోరకాది న్యాయముగ నీయత్నము ఫలవత్తరమై కీర్తిగాంచుగాత. విషయాన్తర స్పర్శము బ్రహ్మసూత్రశణవల్కలన్యాయ ప్రతిబద్ధముగాన ఉపేక్షణీయము. వీరి సేవాఫలముగా ధన్వంతరి వాంఛితార్థములను సమకూర్చుగాత.

అప్పికట్ల } తర్క వేదాన్త మహావిద్వాన్ పణ్డిత
ది 22-2-49 } వేదాన్తం జగన్నాథాచార్యులు

---

అపరోక్షమేవైత దస్మాకం సమూలఘాతం సమున్మూలితార్ష సంప్రదాయాం కుతర్కరాశేస్మిం కలుషితవిహార విహారవ్యవహార సంకలితే కలికాలేఽస్మిన్మూలధన సర్వస్వాపౌరుషేయ వేదవాఙ్మయవిజ్ఞాన గంధోపిమృగ్యతే। మృగ్యతేతరాంతన్మూల భూతస్మృతి పురాణాగమాదిసర్వస్వమపి। కర్మకాణ్డానుసారిభిశ్శతే ష్వేకత్వసంఖ్యా పూరకై రపి నవాసమీచీన స్తత్సంప్రదాయ స్సముపలభ్యతే। ఇయమీదృశీదానీంతనా దుస్థితిర్భారత పుణ్యభూమా। కిమితోధికం విషాదస్థానం నామ। ఏవంస్థితే వైదిక ధర్మసాధనం। "శరీరమాద్యం ఖలు ధర్మసాధన" మితి నాంతరేణ శారీరక మలాపకర్షణం సంభవతి. తత్రచ, వ్యర్థాస్స్యుర్మహర్షీణాం రసాయనాధికారాః॥ ఇతిచరకాచార్య ప్రతిజ్ఞయా ఽయుర్వేదాసాధ్యస్యాభావా త్తదధిదైవత ధన్వన్తరిప్రతిష్ఠాకల్ప సంకలనే సంకల్పః. సనాతనధార్మిక మార్గమాలసూత్రిం శ్రీవేదాంత లక్ష్మణాచార్యాణాం పండితప్రశంసా పాత్రమితి విశ్వసిమి.

వైయాకరణ భూషణ బాలసరస్వతి
విజయవాడ } సర్వతన్త్రస్వతంత్ర కళాశాలా ప్రధానాచార్యః
ది 15-12-48 } తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రీ

---

శ్రీమద్భిః వేదాంతం లక్ష్మణాచార్య వర్యైః ప్రకటితః శ్రీమద్ధన్వన్తరిప్రతిష్ఠాకల్పనామకో గ్రంథః సమగ్రం దృష్టః అత్రచ సంప్రతిలోకే దుష్ప్రచారంగతాః ఐహికాముష్మికోభయవిధ శ్రేయస్సంపాదక శ్రీవైద్యరాజోపాసనోపయోగినః। తత్తన్నిగమాగమస్థాః," ధన్వన్తరిప్రతిష్ఠావిధిః ధన్వన్తరియంత్రమంత్రోద్ధారవిధిః ధన్వన్తరి సహస్రనామావళిః ఇత్యాదయో విషయాః క్లేశలభ్యాః సమగ్రతయా సంగృహీతాః అనేనచ ప్రయత్నేనలోకేస్మిన్ ఆయుర్వేద చికిత్సాయా ఽత్యావశ్యకో భగవదుపాసనా ప్రకారః శ్రీమద్భిరాచార్య మహాభాగైః ప్రకటితోభవతి విషయేస్మిన్ తైః బహోః కాలాదారభ్య అన్వేషణం కృతం, అన్తేచ ఉద్యోగస్సఫలీ

కృతః ఆనేనోపాసేనమూనం ధన్వన్తరి స్వరూపో భగవానాచార్య వర్యాయ పరంపరి తుష్ట ఇతి తర్కయామి॥

త్రిలింగమహావిద్యాపీఠమ్ విజయవాడ ది 13-12-48 }

పూర్వమీమాంసాపండితః
డాం॥ గో వీరేశ్వరశాస్త్రీ

---

శ్రీధన్వన్తరి ప్రతిష్ఠాకల్పోఽయమ్ ఆచార్యమహాభాగానాం చిరంతనస్య, అగణిత పరిశ్రమస్య, అక్రాంతారంభస్య గుణగవేషణ ప్రవణస్య, అవసాయ్యవ్యవసాయస్య, అభినంద్యం సాధకజన శిరోధార్యం మహత్తరంఫలమ్. విశ్వసిమః అభిలషితార్థ పరంపరాం సంపాదయన్ నితాంతముపకుర్యాత్సాధక లోకస్యేతి॥

అమృతలూరు ది 21-1-49 }

విద్వాన్ భిషగ్రత్న
నాగలింగం వేంకటేశ్వరశాస్త్రీ

---

శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులు గారు బహుకాలముగ కృషిచేసి పలు విధముల పరిశోధనలుసల్పి పెక్కు ప్రాచీనగ్రంథములనుండి విషయసేకరణ మొనర్చి శ్రీధన్వంతరి ప్రతిష్ఠాకల్పమును గ్రంథరూపమున బ్రకటించుట యెంతయు ముదావహము. ఇందుసమగ్రముగు ప్రతిష్ఠావిధానము వివరింపబడుటయేగాక సామాన్యముగ నెల్లరకును ప్రత్యహము ననుసరించదగిన ధ్యానోపాసనకును నిది యనుకూలముగ నున్నది. కాన నీంజలి ప్రయోజనమును వినియోగించుకొని శ్రీ ఆచార్యులవారు పొందిన శ్రమను సార్థక మొనర్చుట వైద్యులకును వైద్యేతరులకును కర్తవ్యముగ నున్నది.

శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేద కళాశాలాధ్యక్షులు,

విజయవాడ ది 22-2-49 }

ఆయుర్వేదభూషణ, పండిత
నోరి రామశాస్త్రి A. K. A. C.

---

శ్లో॥ ధన్వన్తరి శ్రీచరకాదియోగి స్వాంతాంబుధేః పార్వికచంద్ర బింబః।
పీయూషపాణిర్భువికంచదద్యాత్ వేదాంతోపాఖ్యాయహి లక్ష్మణాయ॥౧
శ్లో॥ వ్యాధించ లక్ష్మీం కురుతాం న ఆధిం। దేవేన్ద్రధన్వాకృతి కాన్తిభిర్హా।
సంకాశభాగ్భూధనుషాసుపక్ష్మ జ్యాతేకటాక్షైక్షణతీక్ష్ణబాణా॥ ౨

విదితమేవైతత్ భూమండలమండిత పండిత ప్రకాణ్డానాం యత్ ఆయుర్వేద వైద్యవసుంధరోద్ధర్తా ధన్వన్తరి రితి. తస్యధన్వన్తరేః ప్రతిష్ఠాపూజాది విధాయకం ప్రాచీనతమం పుస్తకం లుప్తమేవాసీదితి, స్వకార్యదక్షైరస్మాభిశ్చింతితం। ఏతస్మిన్నేవ కాలే ఆచార్యః కృష్ణాతరంగిణీతట చోడవరగ్రామవాసినః వేదాంతోపనామక లక్ష్మణాఖ్యాయాః భగీరథ ఇవ ధన్వంతరి ప్రతిష్ఠా పూజాదిబోధక ప్రాచీనతమ పుస్తకఖత్రటీనీం తత్ర తత్ర అనవరత ప్రయత్నేనభూమౌ అవతారయిత్వా తస్యాం

అస్మాభిస్స్నానం చ కారయిత్వా సర్వైరపి అస్మాభిః తదృణంచ సంపాదయిత్వా సార్థకనామకాః లక్ష్మణాః విరాజంతే । అతః అవశ్యం ఆజన్మ అస్మాభిః తేషాం లక్ష్మణానాం ఋణవిముక్తా తథా ప్రయతనీయం యథావయం భవేమ॥

కించ నిర్దుష్టం మద్దృష్టం సర్వేష్ట మిదం పుస్తకం అతీవ భిషగ్వరాణాం అన్యేషాం సర్వేషామపి శ్రీ ధన్వంతర్యనుగ్రహ గ్రహోపకారకం ఉన్నతోన్నతరహస్య విషయకం 'సంజీవిన్యౌషధిరివ' శోభతే। అతః అవశ్యం నీరోగకాంక్షిభి రస్మాభిరా దరణీయ మిదమితి మమ ద్రఢీయసీ మతిః॥

ఇతి, శివమస్తు

విజయవాడ
15-12-48

వే. రామస్వామిశాస్త్రీ
సలక్షణ యజుర్వేద ఘనపాఠీ
సర్వతంత్ర స్వతంత్ర కళాశాలోపాధ్యాయః

ధన్వంతరి ప్రతిష్ఠాకల్పము అను యీ చిన్నపుస్తకముపై నాయభిప్రాయమును వ్రాయుమని గ్రంథప్రకాశకులు నన్ను ఆదేశించుటచే ధన్వన్తరి భగవానునికి యథోచిత వాచిక కైంకర్యమును చేయు మహాభాగ్యము యాదృచ్ఛికముగా నాకు లభింప జేసినందుకు వారికి నాకృతజ్ఞతను ముందుగా నివేదింపవలసియున్నది.

ఈ గ్రంథప్రతిపాద్యుడగు శ్రీధన్వంతరి భగవానుడు శ్రీమహావిష్ణుని యవతార మనుట శాస్త్రప్రసిద్ధము. శ్రీ మహావిష్ణువు నందలి జగత్‌స్థితి నిర్వాహకత్వ లక్షణము నకు ఈ యవతారమే ముఖ్యనిరూపకమని చెప్పవచ్చును. సతతపరిణామి యగుటచే యుపచయాపచయములకు గురియగు నొక్క పాంచభౌతిక దేహమును వివిధవ్యాధులకు లోనైయుండుట యనుభవసిద్ధము. వ్యాధులనుండి సంరక్షించుకొనినగాని 'భద్రంకర్ణేభి శ్శృణుయామ దేవాః' అనునట్లు దృఢగాత్రముతో 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః' యని చిరకాలము భగవద్గుణానుభవము చేయుటకు మహర్షులు ఉద్దేశించిన చిరకాలజీవితము నిర్వాహ్యము కాదు. రోగములు లేకుండినగాని జీవితము రుచింపదు. రోగములకు శరీరమే ఆధారము. ఇట్టి రుగ్ణ శరీరాధారులు తమకు రోగములు రాకుండునట్లు కాపాడుకొను మార్గములను ప్రాముఖ్యముగా వచ్చురోగముల పరిహారమును దేశకాల సాత్మ్యముల ననుసరించి చేసికొనదగిన చికిత్సలను తెలిసికొనుట యావశ్యకము. పరమకారుణికుడగు శ్రీమన్నారాయణుడు సమయమును ప్రతీక్షించుచు దేవాసురయుద్ధమందు సముద్రమథన వ్యాజమును కల్పించి దుస్సాధ్యమగు కార్యమున నియుక్తులవారికి సాయమై కూర్మరూపమునుదాల్చి మంథరపర్వతమున కాధారమై మంథనకార్యమును నిర్వర్తించి లోకోజ్జీవనమును సౌషధీప్రభవమునగు నమృతమును చేధరించి ధన్వంతరిరూపమున నవతరించి యదే సమయమున నసురుల నేమరించుటకై మోహినీవేషమును ధరించి యాయుర్వేదమును ప్రవ రింపజేసెను.

ఈ ఆయుర్వేదమునందు ఆరోగ జీవితమునకు వలయునన్ని సాధనములు పరిపూర్ణముగ నుపదేశింపబడినవి. భగవానుని యే యవతారమునందును కాన రాని మహత్త్వము ఈ అవతారమందు వ్యక్తీకరింపబడుటను మనమిచ్చట జ్ఞాపకమునం దుంచుకొనవలయును. యోగపద్యమున కూర్మముగను, ధన్వంతరిగను, మోహినిగను మూడవతారములను ధరించుటయే ఇందలి వైలక్షణ్యము.

ఇట్టి మహనీయుని విగ్రహరూపమున నర్చాసమాధియందు ఆరాధించుట చేత ననికి స్వరూపప్రాప్తము. దీనికి వలయు ప్రతిష్ఠార్చనాదులు మంత్రయంత్రములు యీ పుస్తకమునందు ప్రచురింపబడినవి. సమారాధన భేదములగు జపహోమతార్చన ధ్యానములకు ప్రయోగరూపముగ శ్రీ ధన్వంతరి దేవుని యుపాసన విధానము పరిపూర్ణముగ సులభశైలిని ఇందు సంధానము చేయబడుటచే ఇత్యాది సాధకులకు పరమోపకారి కాగలదు. ఇట్టి గ్రంథమింతవరకు యేభాషయందు గాని ప్రచురింపబడలేదని తలచెదను.

భగవచ్ఛాస్త్ర సంహితలలో నీకల్పమును మహర్షులు వివరించుట యెంతయు ఆశాజనకముగ నున్నది.

శ్రీ ధన్వంతరి భగవానుని ప్రశంస శ్రీ భాగవతమున మూడు చోటులందు చెప్పబడినరీతి నుదహరించి యీ ప్రసంగము ముగించెదను.

సురాసురాణా ముదధిం మథ్నతాం మందరాచలమ్
దధ్రేకమఠ రూపేణ పృష్ఠ ఏకాదశే విభుః ॥ ౧౬

ధాన్వంతరం ద్వాదశమం త్రయోదశమమేవచ
ఆపాయయత్సురానన్యాన్ మోహిన్యా మోహయన్ స్త్రియా ॥ ౧౭

(శ్రీ భాగవతే స్కంధే ౧ అధ్యాయే ౩)

ధన్వన్తరిశ్చ భగవాన్ స్వయమేవకీర్తిః
నామ్నాం నృణాం పురుభుజాం రుజఆశుహన్తి
యజ్ఞేచ భాగమమృతాయు రవావరుంధ
ఆయుష్యవేద మనుశాస్త్యవ తీర్యలోకే ॥ ౨౧

(స్కం ౨ అధ్యా ౭)

అథోదధేర్మథ్య మానాత్కాశ్యపైరమృతార్థిభిః
ఉదతిష్ఠన్ మహారాజపురుషః పరమాద్భుతః ॥ ౩౧

దీర్ఘపీవర దోర్దండః కమ్బుగ్రీవో రుణేక్షణః
శ్యామల స్తరుణః స్రగ్వీసర్వాభరణ భూషితః ॥ ౩౨

పీతవాసా మహోరస్కః సుమృష్ట మణికుండలః
స్నిగ్ధకుంచిత కేశాన్తః సుభగః సింహవిక్రమః ॥ ౩౩

అమృతాపూర్ణకలశం బిభ్రద్వలయ భూషితః
సవై భగవత స్సాక్షాద్విష్ణో రంశాంశసమ్భవః॥ 38
ధన్వన్తరిరితిఖ్యాతః ఆయుర్వేద దృగ్విభజ్యభాక్

(స్కాం ౧. అధ్యా ౧.)

ఈ చిన్నయంశమును వ్రాయుట కవకాశ మొసగిన గ్రన్థప్రకాశకులకు మఱి యొకతూరి నాకృతజ్ఞతను నివేదించుచున్నాను.

తిరుపతి
సర్వధారి, మార్గశిర
శుక్లసప్తమీ

పార్థసారధిః
శ్రీ వైఖానస విద్యాలయము,
ఆకులమన్నాడు

శ్రీ వేదాంతం లక్ష్మణాచార్యులుగారు ప్రచురించిన శ్రీ మద్ధన్వంతరి ప్రతిష్ఠాకల్పము చూచియున్నాను. ఇది సాంప్రదాయసిద్ధముగ సమకూర్చబడియున్నది. వీరి ప్రయత్నము సఫలము అగుగాక.

ఆరోగ్యమందిరం,
బెజవాడ.
29—12—48

భిషగ్రత్న
డా॥ ఆచంట లక్ష్మీపతి, బి.ఎ.,యం.బి.సి.యం.,

---

శ్రీ మద్ధన్వంతరి ప్రతిష్ఠాకల్పము నామూలాగ్రముగ దిలకించు భాగ్యము నాకు లభించెను. గ్రంథము సమకూర్చిన శ్రీ ఆచార్యులవారికి వివిధాగమములయందును, వేద మంత్రవైద్యశాస్త్రములయందును గల ప్రతిభ సయితము కొంతవఱకు నాకెఱుక కలదు. ఉత్తరహిందూస్థానమున నచ్చటచ్చట శ్రీ ధన్వంతర్యాలయములు గలవు. అపరధన్వంతరియగు శ్రీగోపాలాచార్యుండుద్భవించిన నాటంగోలె మన యాంధ్రదేశమునందుగూడ ధన్వంతర్యాలయవిగ్రహప్రతిష్ఠాపనములు,అర్చనాదులు వెలయుటంజేసి యా మహాదేవుని బూజించు విధానములు, వ్రతకల్పాదులు, ప్రతిష్ఠాకల్పములును జాల నవసరములాయె. ఆ కొదువందీర్ప సర్వవిధముల నర్హులగు శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులవారు కంకణము వహించి యేతద్గ్రంథ ప్రచురణకార్య నిర్వహణ మొనర్చినందులకు నస్మదాదు లెంతయో కృతజ్ఞులు. యీ కార్య మొనర్చిన వీరివలన వైద్యలోకమే గాక, ఆరోగ్యభాగ్యమువడయు సర్వాంధ్రలోకము ధన్యతగాంచెననుట యతిశయోక్తి గాజాలదు.

శ్రీరామమోహన ఆయుర్వేద కళాశాలాధ్యక్షులు
ప్రాణాచార్య, ప్రొఫెసర్,
డాక్టర్ డి. రంగాచార్యులు

గుంటూరు

శ్రీధన్వన్తరి ప్రతిష్ఠాది విషయక విశేషములను సేకరించుటలోను ముద్రింపించుటలోను శ్రీ ఆచార్యులుగారు పడినశ్రమను నేనుస్వయముగా నెఱుంగుదును. ఈశ్వర సేవానిమిత్తముగను, లోకసేవానిమిత్తముగను నిట్లు పరిశ్రమ చేసినవారు సర్వజనవంద్యు లనుటలో సందియము లేదు.

ఇట్లు
జటావల్లభుల పురుషోత్తము, ఏం.ఏ.
యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్ కాలేజి

విజయవాడ
10—12—48

ఓం

శ్రీరస్తు

ఈపుస్తకమును శ్రీయూన్ వేదాన్తం లక్ష్మణాచార్యులవారు బహు ఆర్షగ్రంథముల, వైద్యశాస్త్రముల మంత్రశాస్త్రముల పరిశోధించి సంగ్రహించిరి. వీరికృషిని ప్రాజ్ఞులు గ్రహింతురుగాక. వీరు మరికొన్ని గ్రంథములద్వారా హిందూమతమును బహిర్గతమొనరించుగాక యని శ్రీమన్నారాయణుని ప్రార్థించుచుంటి.

ఇట్లు,
దీవి కృష్ణభట్టాచార్యులు
శ్రీ విఖనస గ్రంథమాలా సంపాదకులు

ఎడ్లపల్లి,
24—2—49

---

మిక్కిలిశ్రమపడి పట్టుదలగా తిరిగి మాతృకల సంపాదించి నిగూఢమైన విషయములను లోకోపకారము కొరకు సంగ్రహించి ఈగ్రంథరూపముగా ప్రకటించిన శ్రీయూన్ ఆచార్యులువారు వైద్యలోకమునకేగాక ఆంధ్రప్రజలకు గూడ మహోపకార మొనర్చిరనుట కట్టి సందియములేదు.

ఇందలి ప్రతిష్ఠాది విధానముల సక్రమముగా నాచరించి, వైద్యులాధ్యాత్మిక శక్తిసంపన్నులుగను నాతురులారోగ్య భాగ్యయుక్తులుగను దేశోపకారకులై వీరి కృషిని సఫల పర్చెదరని నమ్ముచున్నాను.

ఇట్లు
విద్వద్వైద్యవిధేయుడు,
ఆయుర్వేదాచార్య
ముక్కామల వెంకటశాస్త్రి

శాస్త్రియఓషధీనిలయం,
బెజవాడ
4—12—48

---

శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులుగారు శ్రమపడి ప్రకటించిన ఈ ధన్వంతరి ప్రతిష్టాకల్పమును చూచినాను. కాగితపు కాటకపు దినాలలో దీన్ని వీరు ప్రయపడి ప్రకటించడం మెచ్చుకోతగిన విషయం. భక్తుల కందరికి ఇది చాలా ఉపయోగపడ గలదని నేను నమ్ముచున్నాను.

ముక్త్యాల,
కృష్ణాజిల్లా.

శ్రీధన్వంతరి పత్రికా సంపాదకులు,
భిషగ్వర వేటూరి శంకరశాస్త్రి, ఏ.ఎం. ఏ.సి.

---

శ్రీ ధన్వంతరి ప్రతిష్ఠాకల్పమను గ్రంధమును స్థూలదృష్టిగా పర్యావలోకన మొనర్చితిని, వైద్యశాస్త్రమును ప్రధానవిద్యగా నుపాసింప నుద్యమించువారు ముఖ్యముగా సేవించదగిన దైవముయొక్క స్తోత్రవ్రతాదివిషయిక పరిజ్ఞానము మన ప్రాచీన గీర్వాణగ్రంథ సముదాయమునుండి గ్రహించి, పాఠకులకు విశదమగుభంగిని యీ ప్రతిష్ఠాకల్పమును వివరముగా తెలిపి యున్నారు. భిషగ్వరులకేగాక సర్వభక్తజనుల కును యీ గ్రంధము పూజాయోగ్యమై వెలయుగాత.

నూజివీడు
28—12—48

సాహితీవల్లభ
శ్రీ వేంకటాద్రి అప్పారావు ప్రభువులు

---

శ్రీధన్వంతరిప్రతిష్ఠాకల్పము శ్రీవేదాంతం లక్ష్మణాచార్యులవారు సంకలితముచేసి ప్రచురించియున్నారు. దానిని నేను సమగ్రముగా జదివితిని. అందు శ్రీ ప్రతిష్ఠావిధానము అర్చనవిధి, భృగుసంహితోక్తార్చనాధికార ప్రతిష్ఠానుక్రమణిక ధన్వంతరియంత్రమంత్రోద్ధారము, మంత్రగాయత్రీ ఉద్ధారము, ధ్యానములు, చూర్ణిక, అష్టోత్తరశతనామావళి. సహస్రనామావళి, కరావలంబస్తోత్రము, సుప్రభాతస్తోత్రము, లోనగువానితో విరాజిల్లుచున్నది. మఱియు నింబాయుర్వేదప్రశస్త ప్రభావపారంపర్య ప్రాప్తియు, భృగ్వాది మహర్షులీయాయుర్వేదము జగంబుల ప్రసక్తికిం దెచ్చినవిషయాదిక మిందు సప్రమాణముగా సూచింపబడినది.

ధన్వంతరి ప్రతిష్ఠారాధనాదిక మొనర్చువారలకీ గ్రంథము మహోపకారకము చున్నదని చెప్పుటకావంతయు సందేహములేదు. అనేకశాస్త్రోక్త విషయములిందు పొందుపడియున్నవని మఱియుం చెప్పుచున్నాను.

రాజమండ్రి
10—12—48

శ్రీ మహామహోపాధ్యాయ, కలాపరిపూర్ణ కవిసార్వభౌమ
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

---

శ్రీధన్వన్తరి ప్రతిష్ఠాకల్పము నంతయుచూచి ఆనందించితిమి. ఇట్టి విష యములలో సమకూర్చిన గ్రంథము లిదివరకు నెచ్చటను చూడలేదు. వినికిడియు మాత్రము కలదు. మంత్రభాగములు రహస్యముగా నుంచుటచే యింక చేర వలసినవి యుండియు నిపుడు లభ్యముగాక చేర్చలేకపో యినితలచెదము. తాళపత్రములయందు, పూర్వులు యెన్నెన్ని మంత్రజాలములు గుప్తపరచిరి. పండిత, పామరులకు సైతము నట్టివిలభించక, నెన్నియో శిథిలావస్థ చెందియుండును. గొప్ప ఆస్తికబుద్ధితో, వైద్యులకేగాక సర్వప్రజలకు సులభముగానుండులాగున యీగ్రంథమునందు శ్రీధన్వం తరి ప్రతిష్ఠా అర్చనపూజాదులు యంత్ర మంత్ర మహామంత్ర గాయత్రీ సహిత స్తోత్రములు చాలవరకు మహత్తరమగు మృతసంజీవని మహామంత్రములు సహా సంపాదించి బహిర్గతమగునట్లు ముద్రించి ప్రకటనము గావించి ప్రజాసేవకుడై, కష్టనష్టములను పాటించని వేదాంతం లక్ష్మణాచార్యుని, శ్రీధన్వంతరి భగవానుడు సర్వకాలములయందును రక్షించుగాకయని ప్రార్థింపుచు నీకని మేము నారాయణ స్మరణపూర్వకముగ ఆశీర్వదింపుచుంటిమి. సమస్తాస్సుఖినో భవంతు.

బెజవాడ
16—12—48

శ్రీజగద్గురు భగవచ్ఛంకర పాదారవింద విరతిశయులగు
నవభారతయతీంద్ర స్వాములవారు
శ్రీ దుర్గాక్షేత్ర ఆశ్రమవాసులు

---

శ్రీ ధన్వంతరి ప్రతిష్ఠా కల్పమను గ్రంథమును జూచితిని. ఇది శ్రీ ధన్వంతరి యుపాసకులకు కల్పవృక్షమని చెప్పవచ్చును. శ్రీవారి జయంతిని ప్రతి సం॥ర మొనర్చెడి వారలకు విధిచోదితమైన పూజాకల్ప మీయాగ్రంథమునుండి యుద్ధరింపబడి భక్తుల కందీయబడినది. ఇందు శ్రీవారి ప్రతిష్ఠాపూజాకల్పము సహస్రనామావళీ స్తోత్ర శ్లోక ములు మొదలుగాగల పూజావిధానములన్నియు సమకూర్పబడినవి. ఆయుర్వేదస్వరూపు లైన శ్రీ ధన్వంతరివారి పూజావిశేషముతోగాక ఆయుర్వేదమునకు సారభూత మనదగిన "మృతసంజీవనీ మహామంత్రము" యజుర్వేద అథర్వణవేదయుక్తములైన వివిధమంత్ర రూపము లిందు వివరింపబడినవి. ఇందువలన విస్మరింపబడిన యీ మృతసంజీవనీవిద్యో పాసన తిరిగి యుపాసకుల కందీయబడినది. సత్పురుషులు దీని నుపాసించి సిద్ధినిబొంది లోకానుగ్రహముగా బ్రవర్తింపదగు కాలము భారతీయుల కందుబాటులో నున్నటుల భావింపదగును. అన్ని విధముల నీగ్రంథము దేశకల్యాణదాయకమని భావింపుచున్నాను.

ఇందు శ్రీమాన్ వేదాంతము లక్ష్మణాచార్యులవారి సేవను ముఖ్యముగా ప్రశం సింపతగి యున్నది.

గాంధీనగరం,
విజయవాడ.
12—2—48

కోట వెంకటాచలం
అద్వైతబోధిని, నిర్విచారజీవనము, ఆభాసత్రిస్తవము, బ్రహ్మాండ సృష్టివిజ్ఞానము, మానవసృష్టివిజ్ఞానము, కలికవిజ్ఞానాది గ్రంథముల రచించిన గ్రంథకర్త.

శ్రీ ధన్వంతరి ప్రతిష్ఠా కల్పమను పొత్తముచూచి సంతసించితిని. జరారుగ్భయ మృత్యునాశకుడగు యాదిదేవుండు శ్రీధన్వంతరిని అర్చనచేసి గొలచి, చ్యవనాది మహర్షులు పునీతులైనారు. సర్వలోకవంద్యుడగు ధన్వంతరి ప్రతిష్ఠ అర్చన పూజా జపవిధానములను చాలగ శ్రమించి సంగ్రహకర్తగారు వెల్లడించినారు. వీరికృషి శ్లాఘాపాత్రము. వైద్యులేగాక సర్వజనులు ఆయురారోగ్యైశ్వర్య ప్రదాతయైన శ్రీ ధన్వంతరి భగవానుని గొలిచి స్వాస్థ్యవర్ధనులై సుఖింతురుగాక॥

విజయవాడ
15—12—48 }

ఇట్లు,
వైద్యశ్రీ ప్రకాశ చంద్రశతపథి

ఆయ్యా, శ్రీ మద్ధన్వంతరి ప్రతిష్ఠా కల్పమను గ్రంథమును ఆసాంతము చూచితిని. యిద్యేది నాటకముకాదు, నవలకాదు. కథలుగావు, ధవనమల్లుటగాదు. యిట్టి కల్పము వ్రాయుట సాహసకార్యమే. ఈ కల్పము త్రివిపభక్తి సాంప్రదాయముల ననుసరించియే యున్నట్లుతోచును. ధన్వంతరి దైవము పూజించు భక్తకోటికిది చాలా ఉపయోగకరమైన గ్రంథరత్నము. ఇంతవరకు ఇట్టిగ్రంథమును నేను చూచియుండలేదు. కొందరు ఆయుర్వేదవైద్యులు శ్రీ ధన్వంతరి జయంతీ ఉత్సవ పూజా సమయములో ఎట్టిమతమున ఏయేసహస్రనామములు చెప్పవలయునాయని, మథ్యపడుట నేను చూచితిని. ఇందులో సమకూర్చిన సహస్రనామ అష్టోత్తర శతనామ స్తోత్రాదికముల వలన నన్నిమతములకు నట్టిసందేహములు తీరినవనితలచెదము.

బహుశ్రమతో లోనైపురాతన సంస్కృత గ్రంథములను పరిశీలించి ప్రతిష్ఠా సహిత యంత్రమంత్ర తంత్రోక్త కల్పాదివిధి విధానముగా సమకూర్చి ఈ గ్రంథరూపకముగ మనలకు, మహోపకారమొనరించి రనుటకు సందియములేదు. ఈవిధముగ శ్రీధన్వంతరి భగవానుని యపారకరుణచే ననవరతము పట్టుదలతో, పరిశోధించి, ముద్రింపించి ప్రకాశవంతముచేసి, ఆంధ్రవైద్యసోదరుల కందించినందులకు శ్రీ పరమేశ్వరుండు వైద్యవిద్వాన్ భిషగ్రాజ శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులగారికి ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చి వాంఛితార్థముల నొసంగి లోకకల్యాణము చేకూర్చుగాక.

బెజవాడ
15—2—49 }

ఇట్లు,
జంధ్యాల దక్షిణామూర్తి, ఎల్.ఐ.ఎమ్.
సా. జె. డి. హాస్పటల్, గౌనరుపేట

ఉత్తములు లోకారాధ్యులు. ఉత్తమత అనన్యసాధ్యకార్యనిర్వాహణజన్మ. అకాల మృత్యువును పారద్రోలువాడు మహాత్ముడు. కాదని ఎవరనగలరు. ఆ ప్రయత్నము అభినంద్యము. ప్రతికూలశక్తుల నధిగమించి తాదలంచిన కార్యమును గట్టెక్కించుకొనుట నాస్తికత ప్రబలిన యీరోజులలో ఒక మహాత్ముడు మానవారోగ్య జీవనవిధాత, ఆద్యవైద్యఋషియగు ధన్వంతరికి ప్రాణప్రతిష్ఠాత్మక కల్పమును ఉద్ధరించుట ఆత్మసోదరోద్ధరణమే కాగలదు. తత్సాఫల్యము తదీయధర్మాచరణము తద్ధర్మ అధ్యయనాధ్యాపనములు, తద్వ్యాప్తియు సాధనకము. అట్టిదియ, ఆశాస్యము. దానికై నడుము బిగించుటకు ప్రోత్సాహ మొసగిన శ్రీశ్రీ వైద్యవిద్వాన్ వేదాంతము లక్ష్మణాచార్యులుగారు అభినంద్యులు.

ప్రస్తుతమకాం
తెనాలి
5—3—49

ఇట్లు,
మదనమోహన విద్యాసాగర్
వేదాలంకార్, లాహోర్.

శ్రియం నరాణాం ధనధాన్యవృద్ధిం
తదోభగసిద్ధ్యా కుశలంచ ధత్తే
సద్వైద్యమూర్త్యా విచరన్ రమేశః
స్వాధీనలోక స్థితిమాత్ర హేతుః॥ ౧

సఏవ ధన్వన్తరి రర్చనీయః
ప్రపిత్సుభిః ప్రాణిభిరాయురాది
దయావిశుద్ధో వసుదానశౌణ్డః
సంప్రార్థితః పూరయతీ హితంనః॥ ౨

తదర్థమేవాయ మపూర్వకల్పః
సంకల్పితో లక్ష్మణ పణ్డితేన
తచ్చాఖ్యాతిం మహాప్నుయాత్సో
జీయాత్సదా పుత్రకళత్రబన్ధుమ్॥ ౩

పొన్నూరు
25—1—49

ఇతి
పరాశరం వేఙ్కటకృష్ణమాచార్యః
శ్రీ భా॥ సం॥ పాఠశాలా, స్వర్ణపురి

శ్రీ ధన్వంతరిప్రతిష్ఠా కల్పమును చూచి మోదమందితిని. శ్రీ ధన్వంతరి భగవానుడు సాక్షాద్విష్ణుమూర్తి యవతారమని సర్వజనులకు తెలిసియున్నది. అయినను యీ మూర్తిని విగ్రహారూపమున పూజించుటకు ఉపాసించుటకు వలయు మంత్రకల్పములు ప్రచారమున లేనందున ఆ ధన్వంతరి భగవానుని ఉపాసించుటగాని, ఆరాధించుటగాని జరుగుట లేదు.

శ్రీ ధన్వంతరి దేవుని అర్చించుటకు వలయునన్ని సాధనములు యిందు వివరింపబడియుండుటవల్ల ఆలోటు తీరినదనియే తలచెదను. చింతలూరులో ప్రతిష్ఠించిన దేవాలయము శ్రీవారి భక్తులకు కొంత ముదము చేకూర్చినది. అయినను తదుపాసనాపద్ధతులు లేని లోటు భక్తులకు గలిగియున్నది. అనేక వ్యయప్రయాసల కోర్చి ఈ గ్రంథమును సమకూర్చిన శ్రీమాన్ లక్ష్మణాచార్యులవారికి శ్రీ ధన్వంతరి భగవానుడు సర్వవిధముల తోడ్పడుగాక యని ప్రార్థించుచున్నాడను.

మునునూరు }

నేదాంతం కేశవాచార్యులు
(ఆయుర్వేదాలంకార ఎ.వి.ఎ.సి.)

ఆయుర్వేదాభిమానులారా!

శ్రీ లక్ష్మణాచార్యులుగారు సంపాదించి ముద్రించిన ఈ చిన్నపొత్తము లోకమునకు చాల యుపకరించునని తలంతును. ఏలనన, అసాధ్యవ్యాధు లుత్పన్నమైనప్పుడు శ్రీ ధన్వంతరి భగవానుని యర్చించుటవల్ల అవి నివారించునని చెప్పబడియున్నది. అందులకు వలయు యంత్రములు, మంత్రములు, విగ్రహారాధనకొఱకు బింబప్రతిష్ఠార్చనాదికము ఇందు కూర్చుటచేత వీరు లోకోపకారులైరి.

పూర్వము శ్రీ ధన్వంతరి దేవుని యర్చించి పుష్పవేణియను సుందరి సర్పదష్టుడై మృతినొందిన భర్తను తిరిగి జీవింపజేసెను. అటులనే అంధుడును ముదుసలియును అయిన చ్యవనమహర్షిని పెండ్లాడిన సుకన్య శ్రీ ధన్వంతరి భగవానుని యర్చించి యౌవనవంతునిగ, సౌందర్యవంతునిగ జేయగలిగెను.

గాన ప్రజలు శ్రీ ధన్వంతరి భగవానుని పూజించి సఫలమనోరథు లగుటకు ప్రయత్నించుచూ ఈగ్రంథముద్రాపకుని శ్రమను సఫలముచేయ ప్రార్థించుచున్నాను.

చోడవరం }

తిరునఘరి సీతారామానుజాచార్యులు

# విజ్ఞప్తి

శ్రీమద్ధన్వంతరయేనమః

శ్లో॥ కరకిసలయ సంగే యస్య పీయూషకుమ్భః
పరమపర వధూనాం భూయసే మంగళాయ
సకలునిఖిల దుఃఖామ్భోధి రత్నేషురత్నమ్
హరతు దురిత రాశీనాశు ధన్వన్తరిర్వః॥

మహాశయులారా!

ప్రపంచమున మానవజీవితమునకు ముఖ్యములైనవి ఆహారము, వస్త్రము, విద్య, ఆరోగ్యము. ఈసముదాయములో ఆరోగ్యరక్షణము మిక్కిలి అవసరమైయున్నది. అట్టి యారోగ్యరక్షణమునకై ప్రతి దేశమునందును, ఆహార విహారాదులయొక్క మార్పుల ననుసరించి ప్రాచీనులు వైద్యశాస్త్రములను రచించియుండిరి. అందు నాటినుండి నేటివరకు గొప్పప్రచారములోనుండుటయే కాక అనేకసిద్ధుల యనుభవములతో నుద్దీపితమై విదేశీయులకు సైత మాదర్శప్రాయమై పాశ్చాత్యవైద్య తుషారయవనికా గుప్తమయ్యును భాస్కరునివలె నిరంకుశ ప్రకాశమును వీడక అద్వితీయమై యలరారుచున్నది. ఆయుర్వేదవైద్యశాస్త్రము ఒక్కటియేయైయున్నది.

అట్టి లోకోత్తరమగు నాయుర్వేద వైద్యశాస్త్రోత్పత్తి నాకించుక విచారించి తత్కారణభూతుడైన మహాపురుషుని బూజింపవలసిన యావశ్యకత విశేషముగ వైద్యసోదరులయందును సామాన్యమానవ కోటి యందుగూడ కలదనుట నిర్వివాదాంశము.

మరియు కృతయుగంబున దూర్వాసశాపముచే సముద్రగతమైన మహేంద్రుని సంపదలను పునరుద్ధరించుటకై దేవదానవులు కలసి క్షీరసముద్రమును మథించుటయును, అందు లక్ష్మీ చంద్ర కామధేన్వాది ప్రాదుర్భావానంతరము శ్రీమన్నారాయణాంశ సంభూతుండును, స్వకృపావలోకవిదళిత మహామయమండలుండు నగు శ్రీమద్ధన్వన్తరి భగవానుండావిర్భవించి బ్రహ్మేంద్రాదులకు హేతులింగౌషధజ్ఞానములతో గూడినదియు, కేవలము రోగపీడితులకే కాక నిరోగులకు గూడ

ముఖ్యముగ నా|శ్రయస్థానమై యొప్పుచున్న ఆయుర్వేదశాస్త్రమును సాంగోపాంగముగ నుపదేశించి యంతర్ధానమగుట పురాణప్రసిద్ధమే కదా.

అట్టి పరమపూరుషుని ప్రతిష్ఠావిధానమును బహుకాలము నుండియు నచ్చొత్తింపఁబ్రయత్నించుచు నేటికి "శ్రీమద్ధన్వన్తరి ప్రతిష్ఠా కల్పము" అనుపేరుతో ఈయుత్తమ గ్రంథమును స్వధనత్యాగముచే ముద్రింపించి గ్రంథమాలకర్పించిన చోడవరగ్రామ వాస్తవ్యులును, నిగమాగమాయుర్వేద పండితులునగు, శ్రీ॥ ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ వేదాంతం లక్ష్మణాచార్యులవారు సర్వులకు వందనీయములు.

ఏతద్గ్రన్థరాజమును ప్రచురించి శ్రీవైఖానసభగవచ్ఛాస్త్రగ్రన్థ మాలయందు సప్తమానుబంధము నొనర్చిసోదర మహాశయుల హస్తముల నలంకరింపజేయుగల మహాభాగ్యము లభించినందుల కెంతయు సంతసమొందుచుంటిని.

యీముద్రణమున కన్నివిధముల సహాయమొనర్చిన తిరుపతి శ్రీవేఙ్కటేశ్వర సంస్కృత కళాశాలాఽఽగమపండితులును విద్వత్కవి సార్వభౌమ వైయ్యాకరణ పంచానన శ్రీ॥ ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ రాం॥ పార్థసారథిభట్టాచార్య స్వామివారికిని, శ్రీ॥ ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ (దేవరపల్లి) ముత్తేవి అనంత పద్మనాభాచార్యులవారికిని, గ్రన్థమాలోద్ధారకులగు శ్రీ॥ ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ (ఈపూరు) దేవయజనం వేంకటరామాచార్యుల వారికిని, శ్రీ॥ ఉ॥ వే॥ ప్ర॥ శ్రీమాన్ నారాయణం రామానుజాచార్యుల వారికిని, తమకు గ్రన్థమునంగల ఆదరాభిమానములను దయతోఁ దెలియజేసిన పండితప్రకాండులకును, గ్రన్థమాలతరఫున వందనశతంబు లర్పించుచున్నాడను.

ఇట్లు

శ్రీ॥ వై॥ భ॥ గ్ర॥ సంపాదకులు

భిషగ్రాజ, దీవి వేంకట నృసింహాచార్యులు

నల్లూరు

    

శ్రియై నమః

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రీ ధన్వన్తరయే నమః

# —: శ్రీమద్ధన్వన్తరి ప్రతిష్ఠాకల్పః :—

శ్రీలక్ష్మీవల్లభారమ్భాం విఖనోమునిమధ్యమామ్
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥

శ్లో॥ బిభ్రాణ శ్శఙ్ఖచక్రౌషధవిమలసుధాపూర్ణకుమ్భాం శ్చతుర్భి
ర్దోర్భిః పద్మాసనస్థ స్సతతనుతపద శ్చన్ద్రచూడాదిదివ్యైః
నానాబ్రహ్మాణ్డభాణ్డోదరలసదఖిలప్రాణినాం ప్రాణరూపః
పాయా ద్ధన్వన్తరి ర్మాం జటిలనటదఘా చ్ఛిదివ్యావతారః ॥

హరిః ఓమ్

అథ ధన్వన్తరిప్రతిష్ఠాం వ్యాఖ్యాస్యామః. ప్రతిష్ఠోక్తమాస నక్షత్రతిథివారయోగకరణయుతే ముహూర్తే, ఏతద్గుణయుక్తే యజమానజన్మర్క్షే వా శ్రీమద్ధన్వన్తరిప్రతిష్ఠాం కుర్యాత్. గ్రామమధ్యే పృథగాలయే, భగవదాలయస్యోత్తరే, ప్రథమావరణే ద్వితీయే వా, నళినకాదీనామన్యతమే విమానే తద్బిమ్బం చతుర్భుజం, శఙ్ఖచక్రధరం దక్షిణహస్తే నౌషధం, వామహస్తేన సుధాపూర్ణకలశం దధానం, పీతామ్బరధరం, కిరీటహారకేయూరాదిసర్వాభరణభూషిత, మూర్ధ్వపుణ్డ్రధరం, కర్ణాలమ్బితరత్నకుణ్డలకాన్తియుతకపోలయుగళం, శాన్తం, ప్రసన్నవదనం, బ్రహ్మసూత్రసమాయుక్తం, పద్మాసనే సమాసీనం, శిలయా ధ్రువబిమ్బం, తామ్రేణ కౌతుకాదీన్, కుశలేన శిల్పినా కారయేత్.

ఋత్విజ స్సర్వే, యజమానేన సహ ఉప్తశ్మశ్రుకేశనఖాః స్నాత్వా, అఘమర్షణం కృత్వా, సన్ధ్యా ముపాస్య, దేవాదీ నద్భి స్తర్పయిత్వా, బ్రహ్మయజ్ఞం చ కృత్వా, ద్వాదశసూక్తాని, చతు ర్వేదాదిమన్త్రా న్వా జప్త్వా, యజమాన ఋత్విగ్వరణం కరిష్యే ఇతి సఙ్కల్ప్య...గోత్రం ... శర్మాణం ఆచార్యం త్వా మహం వృణే' ఇత్యా చార్య మధ్వర్యూ నన్యాం శ్చ వరయిత్వా తా న్సర్వా న్వస్త్రోత్తరీ యాద్యై ర్గన్ధమాల్యై శ్చాలఙ్కృత్య త త్తత్కర్మణి నియుఞ్జీత.

ఆచార్య శ్చౌపాసనాగ్నా వాఘారం కృత్వా సర్వేషా మృత్విజాం యజమానస్య చ సమస్తపాపక్షయార్థం యద్దేవాదిచతు స్సూక్తా నాజ్యేన హుత్వా, వైశ్వానరాయే త్యగ్నే రుపస్థానం పఞ్చగవ్యప్రాశన మన్త్రహోమం చ కుర్యాత్.

తద్రాత్రౌ విష్వక్సేనారాధనపూర్వకం పుణ్యాహ మఙ్కురా ర్పణం చ కుర్యాత్.

## అగ్నిమథనమ్

ఆలయా త్పూర్వత శ్చోత్తరే వా మనోరమే దేశే గోమయే నోపలిప్య, పఞ్చవర్ణై రలఙ్కృత్య ధాన్యా న్యాస్తీర్య ప్రాగగ్రా న్దర్భా న్విన్యస్య పృథక్ప్రదేశే, అరణ్యాం మహీమ్, మథనదణ్డే విష్ణుమ్, ఊర్ధ్వపట్టికాయా మగ్నిమ్, రజ్జ్వో ర్వాసుకిం చావాహ్యాఽభ్యర్చ్య, ఆచార్యః ప్రాఙ్ముఖః 'అగ్న ఆయాహీ' త్యరణిం ప్రాగగ్రాం, తద్దర్భా స్తృతే దేశే సన్న్యస్య, 'ఆయుర్దా' ఇతి మన్థదణ్డం సంస్థాప్య 'అగ్నిం ధూత' మితి మన్త్రే రజ్జూ సమావేష్ట్య, 'అగ్నిర్మూర్ధే' త్యూర్ధ్వపట్టికాం సంయోజ్య, 'జాతవేదో భువన స్యే' త్యగ్నిం మథిత్వా, ఉత్పన్న మగ్ని 'మాయుర్దా' ఇతి ప్రణమ్య 'ఉపావరో' హేతి గోకరీషే నిధాయ, 'అయ న్త ఇధ్మ' ఇతీన్ధనాని నిక్షిప్య, 'ఘృతప్రతీక' ఇతి పాత్రికాయా మాదాయ, 'అగ్నిరిన్ద్రో' త్యభివాదనం కృత్వాఽప్రమాదం నిదధ్యాత్.

## అక్షిమోచనవిధిః

ప్రతిష్ఠాదివసా త్పూర్వస్మి న్నవమే సప్తమే పఞ్చమే తృతీయే వాఽహ్న్యర్క-రాహుసారాణా ముదయం హిత్వా ద్విలోచనే నక్షత్రే శిల్పినా ప్రథమత శ్చామన్త్రికాఽక్షిమోచనం కారయిత్వా పశ్చా త్సమన్త్రికాఽక్షిమోచన మాచార్యః కుర్యాత్.

దేవ స్యోత్తరే ఔపాసనాఽగ్నికుణ్డే పూర్వోక్తమథితాఽగ్నినై వాఘారం కృత్వా వాస్తుహోమం హుత్వా బిమ్బ స్యాతీవ పార్శ్వతః పర్యగ్నిం కృత్వా పఞ్చగవ్యై ర్బేరం సమభ్యు క్ష్యాఽన్తహోమం కుర్యాత్.

బిమ్బస్య దక్షిణేఽభిముఖే వా ఔపాసనాగ్నికుణ్డం కృత్వా మథితాఽగ్నినై వాఘారం హుత్వా దద్భ్య స్స్వాహే త్యజహోమం మాళిమాలాదీన్ మహాభూతదైవత్యం విష్ణుసూక్తం పురుషసూక్తం వైష్ణవం శ్రీభూమిదైవత్యం బ్రాహ్మం రౌద్రం చ హుత్వాఽన్తః పరిషిచ్య, దేవాభిముఖే గా మేకాం సంస్థాప్య గోసూక్తే నాఽభి మృశ్య ఘృతదధిమధుక్షీరం చ కాంస్యపాత్రే సువర్ణసహితం సఙ్గృ హ్యాఽభిముఖే నిధాయ ఘృతే సామవేదం, దధ్ని యజుర్వేదం, మధుని ఋగ్వేదం, క్షీరేఽథర్వవేదం చాఽవాహ్యాఽభ్యర్చ్య వ్రీహియవమాష ముద్గతిలతిల్వప్రియఙ్గుసర్షపా స్సప్తౌ ధాన్యాని రాశీకృ త్యాఽధిదైవతం వాయు మభ్యర్చ్య హుళికాం తాడనీం సువర్ణేన రజతేన వా కృతాం హేమపాత్రే రజతపాత్రే వా సఙ్గృహ్య దేవాభిముఖే నిధాయ ధ్రువ బేరాఽక్షిమోచనార్థం సువర్ణపాత్రే శుక్లర క్తకృష్ణహరితాదివర్ణాన్ సఙ్గృహ్య తస్మి న్నగ్నిహి మభ్యర్చ్య జయశబ్దజయస్తోత్రై స్సంస్తూయ నృత్తగేయవాద్యై ర్ఘోషయిత్వా దేవాభిముఖే నిధాయ ప్రచ్ఛన్న పటం కృత్వా దేవస్య దక్షిణే ఆచార్య శ్చోత్తరాభిముఖః ప్రాణా యామం కృత్వా 'విష్ణు ర్మాం రక్ష' త్యుచ్చార్య దివ్యరూపం ధ్యాయన్ సువర్ణసూచీదృఢకరీభ్యా మేవ పక్ష్మవర్త్మర క్తశుక్లజ్యోతి ర్మయమణ్డలాని యథాక్రమేణ పృథివ్యాదిమహాభూతాన్తం పరమా త్మాధిదైవతాని స్మృత్వా అతో దేవా దినా దక్షిణనయనే 'సహస్ర

క్షీరస్నా౽దినావామే చాక్షిమోచనం కారయేత్. ప్రచ్ఛన్నపటంవిసృజ్య గోధాన్యాజ్యాదీని దర్శనద్రవ్యాణి తత్తన్మన్త్రైస్సన్దర్శయేత్.

పఞ్చగవ్యాధివాసః

ఆలయస్యోత్తరే పురస్తాద్వా ప్రపాం కృత్వా దేవం ప్రణమ్యా౽౽పోహిరణ్యపవమానై ర్బిమ్బం ప్రమార్జ్య జలద్రోణీమాదాయ సంశోధ్యావటే వరుణం సంపూజ్య 'వసోః పవిత్ర' మితి పఞ్చగవ్యై రాపూర్యా౽ధిదైవ మీశాన మభ్యర్చ్య పుణ్యపుష్పాణి నిక్షిప్య నవవస్త్రాణ్యాస్తీర్య తత్ప్రాచ్యాం మహాపాసనాగ్నికుణ్డం కృత్వా౽౽ఘారం హుత్వా తస్యోత్తరే దేవేశం ప్రణమ్య సప్తభిః కలశైస్సంస్నాప్య పుణ్యాహం వాచయిత్వా నవవస్త్రోత్తరీయాద్యై రలఙ్కృత్యాభ్యర్చ్య విష్ణుసూక్తేన ప్రాక్ఛిరశ్శాయయిత్వా అగ్నిం పరిస్తీర్య, విష్ణవే విశ్వేశాయ జనార్దనాయ సర్వభూతాత్మనే౽వ్యక్తాయాచలాయ దేవేభ్యో భూతేభ్యో నాగేభ్యో లోకపాలేభ్యః స్వాహేతి వ్యాహృత్యన్తం హుత్వా, వైష్ణవం బ్రాహ్మం రౌద్రం ప్రాజాపత్యం వారుణం వైఘ్నం గారుడం వైష్వక్సేనం దిగ్దైవత్యం చ హుత్వా౽గ్నిం విసృ౽జ్యాష్టమఙ్గళపఞ్చాయుధాని విన్యస్య తద్రాత్రౌ తదాలయగత దేవేభ్యః సర్వేభ్యో మహాద్దికం బలిం నిర్వాప్య పురుషసూక్తేన దేవం సంప్రార్థ్య ప్రణామం కుర్యాత్.

క్షీరాధివాసః

ప్రభాతే స్నాత్వా౽౽లయమావిశ్య అధివాసగతం దేవముద్ధృత్య సప్తభిః కలశైః సంస్నాప్య వస్త్రోత్తరీయాద్యై రలఙ్కృత్యాభ్యర్చ్య జలద్రోణీం సంశోధ్య నవవస్త్రాణ్యాస్తీర్య 'శన్నోదేవీ' రితి గోక్షీరేణాపూర్యా౽ధిదేవ మధర్వవేద మభ్యర్చ్య పద్మోత్పలాది పుణ్యపుష్పాణ్యవకీర్య క్షీరం క్షీరోదధి రితి స్మృత్వా విష్ణుసూక్తేన పూర్వవచ్ఛాయయేత్. పూర్వవద్ధోమం హుత్వా తద్రాత్రౌ పూర్వవద్బలిం నిర్వాప్య పూర్వవదాయుధార్చనం ప్రార్థనం ప్రణామం చ కుర్యాత్.

## జలాధివాసః

ప్రభాతే స్నాత్వా పూర్వవ ద్బిమ్బ ముద్ధృత్య స ప్తభిః కలశై స్సంస్నాప్య నవవస్త్రో త్తరీయాద్యై రలఙ్కృ త్యాఽభ్యర్చ్య పుణ్యాహం కృత్వా వారిపూర్ణాం నదీం హ్రదం శుద్ధతటాకం వా శ్రిత్య తజ్జలే ప్రపాం కృత్వా వితానధ్వజదర్భమాలాతరజ్జు స్తమ్భవేష్టనా ద్యై రల ఙ్కృత్య పరితః ప్రావరణం కృత్వా త త్తీరేఽగ్నిశాలాం కృత్వాఽగ్నిం నిధాయ పరి స్తీర్య పరిషిచ్య వైష్ణవం హుత్వా పశ్చా త్సఘృతం పాయస మాదాయ యోగేశాయ, శేషపర్యఙ్కశాయినే,శబ్దబ్రహ్మణే, సముద్రేభ్యః, పర్వతేభ్యో, దేవేభ్య, ఋషిభ్యః,పితృభ్యో, నాగేభ్యో, భూతేభ్యః స్వాహేతి హుత్వా త త్తీర 'మిద మాప శ్శివా' ఇత్యభిమన్త్ర్యాఽధిదేవం వరుణం పుణ్యతీర్థం శివం పుణ్యం దేవావాస మితి చతుర్భి ర్మన్త్రై రర్ఘ్యా న్త మభ్యర్చ్య నవవస్త్రా ణ్యాస్తీర్య పుణ్యపుష్పా ణ్యవకీర్య విష్ణుసూ క్తేన పూర్వవ చ్ఛాయయేత్. అగ్నిం పరి స్తీర్య ధాతాదిపఞ్చవారుణం మూలహోమ మాగ్నేయం చ హుత్వాఽన్తః పరిషేకం కృత్వాఽన్తహోమం జుహుయాత్.

## ప్రభూతబలిప్రదానమ్

తద్రాత్రౌ ప్రభూతం బలి మాహృత్య ముద్గనిష్పావతిలతిల్వో లాజమాషాపూపయుక్తం కటాహే ప్రక్షిప్య పూర్వవ త్తదాలయే గ్రామే చ ప్రదక్షిణక్రమేణ దిగ్దేవతాభ్యో బలిం దత్వా రాత్రిశేషం వ్యపోహ్య ప్రణామం కుర్యాత్.

## ఉత్సవః

ప్రభాతే స్నాత్వా పశ్చా దధివాసగతం దేవ ముత్థాప్య శుద్ధోదకైః సంస్నాప్య గన్ధోదకై రభిషిచ్య నవవస్త్రో త్తరీయాద్యై రలఙ్కృ త్యాఽభ్యర్చ్య యాన మారోప్య గ్రామ మాలయం వా ప్రద క్షిణం కారయిత్వా యజ్ఞాలయే పశ్చిమే అలఙ్కృతే దేశే దేవం బైల్వే ఫలకోపరి ప్రాఙ్ముఖం సంస్థాపయేత్.

